# భగవద్విషయోపనిషత్తులు

ఇవి

దివాన కెబిల్ శ్రీ రాజా గోడే నారాయణ

గజపతిరాయనింగారి

సెలవు ప్రకారము

శ్రీపరవస్తు శ్రీనివాస జగన్నాథస్వామి

అయ్యవారలుంగారిచే

అనేకోపనిషత్తులనుండి

సంగ్రహింపఁబడి

ప్రతిపదార్థతాత్పర్యములతోఁ

జేర్పఁబడి

ముద్రింపింపఁబడినవి.



Published by

HONORABLE SRI RAJAH G. N. GAJAPATIROW.

Printed by N. Subbarow at the Arsha Press

VIZAGAPATAM. 1890.

# అక్షరక్రమసూచిక.


| | పేజి | | పేజి |
|---|---|---|---|
| అగ్నిర్మూర్ధా- | ౧౪ | నసందృశేతిష్ఠతి- | ౨౮ |
| అణోరణీయాన్- | ౨౪ | నాయమాత్మా | ౨౨ |
| అతస్సముద్రాః | ౧౩ | నావిరతోదుశ్చరితాత్- | ౨౩ |
| అపాణిపాదః- | ౧౨ | నిత్యోనిత్యానాం- | ౨ |
| అశరీరమ్- | ౨౨ | నైనంవాచా- | ౫ |
| ఈశావాస్యమ్. | ౩ | పరీంవిశ్వస్య- | ౨ |
| ఏకోదేవః- | ౭ | భీషాస్మాత్- | ౨౭ |
| ఏకోవశీ- | ౨౫ | మహాన్ప్రభుర్వై. | ౧౧ |
| ఏతస్యవాఅక్షరస్య | ౨౬ | యతోవాఇమాని. | ౧ |
| ఏషఆత్మా- | ౧౭ | యతోవాచః. | ౧౮ |
| ఏషలోకపాలః- | ౮ | యత్తదద్రేశ్యమ్- | ౧౩ |
| ఏషసర్వజ్ఞః- | ౨౦ | యస్మాత్పరం- | ౧౦ |
| ఏషసర్వభూతాన్తరాత్మా- | ౨౦ | యస్యామతం- | ౩ |
| తతఃపరంబ్రహ్మ- | ౧౨ | యస్సర్వజ్ఞః- | ౧౫ |
| తందుర్దర్శం- | ౨౧ | యోయోనింయోనిమ్- | ౯ |
| తమీశ్వరాణామ్- | ౧౫ | విజ్ఞానమానన్దమ్. | ౧ |
| నతత్రసూర్యోభాతి. | ౨౮ | సత్యంజ్ఞానమ్. | |
| నతస్యకశ్చిత్పతిరస్తి- | ౬ | సన్మూలాస్సోమ్య | ౧౭ |
| నతస్యకార్యంకరణంచ- | ౮ | సవిశ్వకృత్. | ౧౯ |
| | | హంసశ్శుచిషత్. | ౪ |

ఓం తత్సత్ .

# భగవద్విషయోపనిషత్తులు.

తైత్తి॥ ౩ వ॥ ౧ అను॥

యతో వా ఇమాని భూతాని జాయన్తే।
యేన జాతాని జీవన్తి।
యత్ప్రయన్త్యభిసంవిశన్తి।
తద్విజిజ్ఞాసస్వ।
తద్బ్రహ్మ।

ఇమాని భూతాని = ఈ భూతములు, యతః జాయన్తే = ఎవ్వనివలన పుట్టుచున్నవోకదా- జాతాని = పుట్టినవై, యేన జీవన్తి = ఎవ్వనిచేత బ్రతుకుచున్నవో- ప్రయన్తి = లయమునుపొందుచున్నవై, యత్ అభిసంవిశన్తి = దేనిని పొందుచున్నవో, తత్ విజిజ్ఞాసస్వ = దానిని విచారింపుము. తత్ బ్రహ్మ = అది బ్రహ్మము.

తాత్పర్యము- ఈజగత్తును సృజించునదియు రక్షించునదియు సంహారించునదియు నేదో, అది బ్రహ్మము.

బృహ॥ ౩ అ॥ ౯ బ్రా॥ ౨౮ ఖం॥

విజ్ఞానమానన్దం బ్రహ్మ.

బ్రహ్మ, విజ్ఞానమ్ = బ్రహ్మము, జ్ఞానస్వరూపమైనది- ఆనన్దమ్ = ఆనందస్వరూపమైనది-.

తా॥ పరబ్రహ్మము జ్ఞానానందస్వరూపమైనది-

తై త్తి॥౨వ॥౧అను॥

సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ-

బ్రహ్మ=బ్రహ్మము, సత్యమ్=సత్యస్వరూపమైన
ది-జ్ఞానమ్=జ్ఞానస్వరూపమైనది- అనన్తమ్=అం
తము లేనిది-

తా॥బ్రహ్మము సత్యజ్ఞానానంతస్వరూపమైనది-

తైత్తి॥నారా॥౧౧అను॥

పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ంశాశ్వతగ్ంశివమచ్యుతమ్-

విశ్వస్య పతిమ్= అన్నిటికిని అధిపతియయినవాఁ
డు- ఆత్మేశ్వరమ్=ఆత్మలకు ఈశ్వరుఁడైనవాఁడు-
శాశ్వతమ్=నిత్యుఁడు-శివమ్=మంగళమునిచ్చువాఁ
డు- అచ్యుతమ్=నిర్వికారుఁడు-

తా॥పరమేశ్వరుఁడు అన్నిటికిని అధిపతియు
ను, జీవులకుఁగూడనీశ్వరుఁడును, నిత్యుఁడును, మంగళ
ము నిచ్చువాఁడును, నిర్వికారుఁడునై యున్నాఁడు.

కఠ॥౫వ॥౧౩మ॥

నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్-

నిత్యః ఏకః చేతనః యః= నిత్యుఁడును ఒకఁడు
ను చేతనుఁడునగు ఎవ్వఁడు, నిత్యానాం బ
హూనాం చేతనానామ్= నిత్యులును అనేకులున
గు చేతనులకు, కామాన్ విదధాతి= కోరినవానిని
చేసిపెట్టుచున్నాఁడో-

తా॥పరమేశ్వరుఁడు ఒకఁడు- నిత్యుఁడు- జ్ఞానము గలవాఁడు- జీవులుకోరినదానిని ఇచ్చువాఁడు- జీవులు అనేకులును నిత్యులును తెలిసికొనవారును-

ఈశావా॥౧మ॥

ఈశా వాస్య మిదగ్ం సర్వం
యత్కించ జగత్యాం జగత్-

జగత్యాం జగత్=జగత్తులోను ఉన్న, యత్కించ=యేదిగలదో, ఇదం సర్వమ్= ఇది అంతయును ఈశా వాస్యమ్= ఈశ్వరునిచేత వ్యాపింపఁబడినది-

తా॥ ఈజగత్తులోని దంతయును పరమేశ్వరునిచేత వ్యాపింపఁబడినది-

కేనోప॥౨ఖ॥౩మ॥

యస్యామతంతస్యమతం
మతంయస్యనవేదసః।
అవిజ్ఞాతంవిజానతాం
విజ్ఞాతమవిజానతామ్॥

యస్య అమతమ్=ఎవనికి తెలియఁబడనిదో, తస్య మతమ్=వానికి తెలియఁబడినది-యస్య మతమ్=ఎవనికి తెలియఁబడినదో, సః నవేద=వాఁడు ఎఱుఁగడు- విజానతామ్=తెలిసికొనుచున్నవారలకు, అవిజ్ఞాతమ్=తెలియఁబడనిది- అవిజానతామ్=తెలిసికొనకున్నవారలకు, విజ్ఞాతమ్=తెలియఁబడినది-

తా॥పరమేశ్వరుని మనము దెలిసికొనలే మని యెఱుంగటయె ఆతనిం దెలిసికొనుట అ ట్లు కాక తెలిసికొంటి ననుకొనువాఁడు ఏమియుం దెలియనివాఁడె-

తైత్తి॥నారా॥౧౦అను॥

హగ్ంస శ్శుచిష ద్వసు రన్తరిక్షస
ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్ ।
నృష ద్వరస దృతస ద్వ్యోమస
దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృ
హత్ ॥

హగ్ంసః= పరిశుద్ధుఁడు- శుచిషత్ = పరి శుద్ధులయినవారల మనస్సుల నుండువాఁడు- వసుః= అంతట నుండువాఁడు- అన్తరిక్షసత్= ఆకాశ మున నుండువాఁడు- హోతా= మోక్షము నిచ్చువాఁడు- వేదిషత్ = జ్ఞానమున నుండువాఁ డు- అనఁగా జ్ఞానులజ్ఞానముచేఁ దెలియఁబడువాఁ డు- అతిథిః=నిత్యాపూర్వుఁడు- అనఁగా ఎప్పుడు ను అపూర్వముగానె కనఁబడు వాఁడు- దురోణ సత్ = మనము చేరలేని స్థలమునఁగూడ నుండు వాఁడు- నృషత్ = మనుష్యులయం దుండువాఁ డు- వరసత్ =ప్రశస్తములైన వస్తువులయందుం డువాఁడు- ఋతసత్ =సత్యమున నుండువాఁడు- వ్యోమసత్ =మిక్కిలి పైగానుండెడి అనఁగా న క్షత్రముల స్థానము నందలి యాకాశమున నుం

డువాఁడు- అబ్జాః=నీళ్లను సృజించువాఁడు-గో
జాః=భూమిని సృజించువాఁడు- ఋతజాః=సత్య
మైనదానిని సృజించువాఁడు- అద్రిజాః=పర్వత
ములను సృజించువాఁడు- ఋతమ్=ముక్తులచేతఁ
బొందఁబడువాఁడు- బృహత్= అన్నిటికంటెను
గొప్పవాఁడు-

తా॥పరమేశ్వరుఁడు అన్నిటికంటె గొప్ప
వాఁడు- పరిశుద్ధుఁడు- భూమి జలము మొదలగు
వానినన్నిటిని సృజించినవాఁడు- ఆకాశము మొ
దలగు నన్నిటియందును వ్యాపించియుండువాఁడు-
పరిశుద్ధులైన వారిచేతఁదలంపఁబడువాఁడు- మో
క్షము నిచ్చువాఁడు- ఎప్పటికప్పుడె క్రొత్తవానివ
లెఁ దోచువాఁడు-

ఋగ్వే॥అ౮॥అ౫॥అ౭॥

ఉతైనంవాచాస్త్రియంబ్రువ
న్త్యేనమస్త్రిపుమాన్ బ్రువన్।
పుమాంసంనబ్రువన్త్యేనం
వదన్ వదతి కశ్చన॥
అ ఇతి బ్రహ్మ-

వదన్ కశ్చన=మాటలాడుచున్న ఒకఁడు, ఏ
నం వాచా స్త్రియం బ్రువన్=ఈతనిని వాక్కు
చేతను స్త్రీనిగా చెప్పుచున్నవాఁడై,నవదతి=మా
టలాడఁడు-ఏనం అస్త్రి పుమాన్ బ్రువన్=ఈ
తనిని స్త్రీకాని పురుషునిగా చెప్పుచున్నవాఁడై,

నవదతి= మాటలాడఁడు- ఏనం పుమాంసం న
బ్రువన్—ఈతనిని పురుషునిగాను చెప్పుకున్నవాఁ
డై, నవదతి=మాటలాడకున్నాఁడు- పురుషునిగా
నె వ్యవహరింపుచున్నాఁ డనుట- ఏవః అఃఇతి
బ్రహ్మ=ఈతఁడు రక్షకుఁడనిచెప్పఁబడెడి బ్ర
హ్మమె-

తా॥ ఈ రక్షకుఁడైన పరమేశ్వరుఁడు పురు
షుఁడును కాఁడు- స్త్రీయును కాఁడు- అయినను
పురుషుఁడుగా మాత్రము వ్యవహరింపఁబడుచు
న్నాఁడు-

కౌషీతకీ॥ ౩అ॥ ౮ఖ॥

ఏషలోకపాలఏషలోకాధిపతిరేష సర్వేశ్వరః-
ఏషః లోకపాలః= ఈతఁడు లోకములనుబరి
పాలించువాఁడు- ఏషః లోకాధిపతిః= ఈతఁ
డు లోకములకధిపతియైనవాఁడు- ఏషః సర్వే
శ్వరః=ఈతఁడు సర్వేశ్వరుఁడు-

తా॥ ఈ సర్వేశ్వరుఁడు అన్నిలోకములకును
అధిపతి- కావున నె అన్నిలోకములనును పరిపాలిం
చువాఁడు-

శ్వేతాశ్వ॥ ౬అ॥ ౮మం॥

నతస్యకార్యంకరణంచవిద్యతే
నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే।
పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే
స్వాభావికీజ్ఞానబలక్రియాచ॥

తస్య కార్యం నవిద్యతే=ఆతనికి శరీరము లేదు-
తస్య కరణంచ నవిద్యతే=ఆతనికి ఇంద్రియము
కూడ లేదు- తత్సమశ్చ అభ్యధికశ్చ నదృశ్యతే-
ఆతనితోఁదుల్యుఁడును అధికుఁడును కనఁబడఁడు-
అస్య శక్తిరేవ వివిధా పరా స్వాభావికీచ శ్రూ
యతే= ఈతని శక్తియె అనేకవిధములుగలదిగా
నును గొప్పదిగానును స్వభావసిద్ధమైనదిగానును
వినంబడుచున్నది- అస్య జ్ఞానబలక్రియాచ ప
రా స్వాభావికీ వివిధాచ శ్రూయతే=ఈతని జ్ఞా
నంబునుబలంబునుక్రియయును గొప్పదిగానును
స్వాభావికమైనదిగానును అనేక విధములైనది
గానును వినంబడుచున్నది-

తా॥ పరమేశ్వరునకు శరీరంబును ఇంద్రి
యంబులును లేవు- స్వభావసిద్ధమగు గొప్పశక్తి
యును జ్ఞానంబును బలంబును సృష్ట్యాది వ్యా
పారంబులును గలవు- పరమేశ్వరునితోఁదుల్యుఁ
డును పరమేశ్వరునికంటె నధికుఁడును లేరు-

శ్వేతాశ్వ॥ ౬ అ॥ ౯ మ॥

నతస్యకశ్చిత్పతిరస్తిలోకే
నచేశితా నైవచతస్యలిఙ్గమ్।
సకారణంకరణాధిపాధిపో
నచాస్యకశ్చిజ్జనితానచాధిపః॥

తస్య పతిః కశ్చిదపి లోకే నాస్తి=వానిని రక్షించు
వాఁడు ఒకఁడును లోకమున లేఁడు- ఈశితా

చ నేశః=ఏలువాఁడును లేఁడు-తస్య లిఙ్గం చ నైవ-ఆతనికి లింగంబును లేదు- అనఁగా పుంలింగస్త్రీలింగ నపుంసకలింగములు లేవనుట- సః కారణమ్-ఆతఁడు కారణము- సః కరణాధిపాధిపః-ఆతఁడు ఇంద్రియములకధిపతులైనజీవులకధిపతియైనవాఁడు- అస్య జనితా కశ్చిదపిన- వీనికి పుట్టించువాఁడు ఒకఁడును లేఁడు- అధిపశ్చన-అధిపతియును లేఁడు-

తా॥ పరమేశ్వరుఁడు జీవులకందఱకును అధిపతి- అన్నిటికిని కారణము- ఈతనిని పుట్టించువాఁడును రక్షించువాఁడును ఏలువాఁడును మఱియొకఁడు లేఁడు- ఈతనికి పుంస్త్రీనపుంసకలింగములు లేవు-

శ్వేతాశ్వ॥ ౬అ॥ ౧౧మ॥
ఏకోదేవస్సర్వభూతేషుగూఢ
స్సర్వవ్యాపీసర్వభూతాన్తరాత్మా।
కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస
స్సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ॥ ౧౧॥

ఏకః దేవః సర్వభూతేషు గూఢః-ఒకఁడే దేవుఁడు అన్నిభూతములయందును దాఁగియున్నవాఁడు- సర్వవ్యాపీ=అన్నిటిని వ్యాపించియున్నవాఁడు- సర్వభూతాన్తరాత్మా-అన్నిభూతములకును అంతరాత్మయైనవాఁడు- కర్మాధ్యక్షః-అందఱిపనులకును అధ్యక్షుఁడైనవాఁడు- సర్వభూతాధివాసః- అన్ని

భూతములకు సాధారణమైనవాఁడు- సాక్షీ-అంద
ఱను సాక్షియైనవాఁడు- చేతా- తెలిసికొను
వాఁడు- కేవలః- అసహాయుఁడు- నిర్గుణః-స
త్త్వరజస్తమస్సులులేనివాఁడు-

తా॥ పరమేశ్వరుఁడు అన్నిభూతములలోను నుండువాఁడు- అన్నిటినిని వ్యాపించియుండువాఁడు- అందఱును చేసెడి పనులను చూచుచుండును- అన్నిటికిని ఆధారమైనవాఁడు- సహాయమక్కఱలేని వాఁడు- సత్త్వరజస్తమో గుణములులేనివాఁడు-

శ్వేతా॥ ౪అ॥ ౧౧మ॥

యోయోనింయోనిమధితిష్ఠత్యేకో
యస్మిన్నిదంసంచవిచైతిసర్వమ్।
తమీశానంవరదందేవమీడ్యం
నిచాయ్యేమాంశాన్తిమత్యన్తమేతి॥

యః ఏకః యోనింయోనిమ్ అధితిష్ఠతి- ఏ యొక్కఁడు ప్రతికారణమునను అధిష్ఠించుచున్నాఁడో- యస్మిన్ ఇదం సర్వం సమేతిచ-ఎవ్వనియందు ఇది అంతయును లయమును బొందుచున్నదో- వ్యేతిచ- అనేకవిధములనుబొందుచునుగూడనుండునో- వరదమ్ దేవమ్ ఈడ్యం తమ్ ఈశానమ్ నిచాయ్య-మోక్షమునిచ్చువాఁడును ప్రకాశించువాఁడును స్తోత్రము చేయఁదగినవాఁడునగు ఆఈశ్వరుని తెలిసికొని, ఇమాం శాన్తిమ్

అత్యన్తమ్ ఏతి— ఈ శాన్తిని మిక్కిలిగా పొం దుచున్నాఁడు-

తా॥ పరమేశ్వరుఁడు మూలప్రకృతి మొదలగు కారణములన్నిటియందునున్నాఁడు- సంహారకాలము న జగత్తంతయు నాతనియందులయమును బొందు ను- సృష్టికాలమున వెండియు ననేకవిధములుగా బయలుదేరును- ఆతఁడు మోక్షమునిచ్చువాఁడు- ప్రకాశించువాఁడు- ఆతఁడెస్తోత్రము చేయఁద గినవాఁడు- ఆయీశ్వరునిగూర్చినజ్ఞానముచేతనే మోక్షమునుపొందుదురు-

శ్వేతాశ్వ॥ ౩ అ॥ రామం॥ ముణ్డ॥ ౧॥ ౧॥ ౭॥

యస్మాత్పరంనాపరమస్తి కిఞ్చి
ద్యస్మాన్నాణీయో నజ్యాయోస్తి కశ్చిత్ ।
వృక్షఇవస్తబ్ధో దివితిష్ఠత్యేక
స్తేనేదంపూర్ణంపురుషేణసర్వమ్॥

యస్మాత్ పరమ్ అపరమ్ కిఞ్చిదపి నాస్తి—ఎవ్వ నికంటె గొప్పది మఱియొకట్టి ఒకట్టియును లేకో, యస్మాత్ అణీయః న— ఎవ్వనికంటె సూ క్ష్మమైనది లేదో, యస్మాత్ జ్యాయః కశ్చి త్ న—ఎవ్వనికంటె గొప్పది ఒకట్టియును లే దో, (యః) ఏకః—(ఏ) ఒకట్టఁడు, వృక్షఇవ స్త బ్ధః (సన్) దివి తిష్ఠతి— చెట్టువలె కదలనివాఁడు (అగుచు) తనమహిమయందు ఉన్నాఁడో, తేన పు రుషేణ ఇదం సర్వం పూర్ణమ్— ఆ పురుషునిచే

తను ఇది అంతయును నిండియున్నది.

తా॥ పరమేశ్వరునికంటె గొప్పది ఏదియును లేదు- పరమేశ్వరుఁడు అన్నిటికంటె సూక్ష్మమైనవాఁడు- ఈతఁడు అంతటను నిండియున్నాఁడు-

శ్వేతా॥ ౩ అ॥ ౧౨ మ॥

మహాన్ప్రభుర్వై పురుష
స్సత్త్వస్యైష ప్రవర్తకః।
సునిర్మలామిమాంశాన్తి
మీశానో జ్యోతిరవ్యయః

పురుషః మహాన్ ప్రభుర్వై= పరమపురుషుఁడు గొప్ప ప్రభువుగదా- ఏషః= ఈతఁడు, సునిర్మలామ్ ఇమాం శాన్తిమ్(ఉద్దిశ్య)= మిక్కిలి నిర్మలమైన ఈ శాంతిని (గురించి), సత్త్వస్య ప్రవర్తకః= అంతఃకరణమునకు ప్రేరకుఁడు- అనఁగా ప్రేరణమును జేయువాఁడు. ఈశానః= ఏలువాఁడు- జ్యోతిః= ప్రకాశస్వరూపుఁడు- అవ్యయః- నాశములేనివాఁడు-

తా॥ పరమేశ్వరుఁడు జగత్తుయొక్క సృష్ట్యాదులంజేయువాఁడు- గొప్ప సామర్థ్యము గలవాఁడు- మోక్షమును గూర్చి మనస్సును ప్రవర్తింపఁజేయువాఁడు- అందఱకును ఏలిక. జ్యోతిస్స్వరూపుఁడు- నిర్వికారుఁడు-

శ్వేతా॥ ౩ అ॥ ౭ మ॥

తతః పరంబ్రహ్మ పరం బృహన్తం
యథానికాయం సర్వభూతేషుగూఢం।
విశ్వస్యైకం పరివేష్టితార
మీశంతం జ్ఞాత్వాఽమృతాభవన్తి॥

పరంబ్రహ్మ తతః పరమ్ బృహన్తం(చ)— పర బ్రహ్మము ఆజగత్తుకంటె ఉత్కృష్టమైనదియు పెద్దదియును- యథానికాయమ్—శరీరముఁబట్టి, సర్వభూతేషు గూఢమ్— అన్నిప్రాణులయందును అణఁగియున్నది- విశ్వస్య పరివేష్టితారం. తమ్ ఏకమ్ ఈశం జ్ఞాత్వా=లోకమును చుట్టుకొని యున్న ఆ ఒకటి ఈశ్వరుని తెలిసికొని, అమృతాః భవన్తి— ముక్తులు అగుచున్నారు

తా॥ పరబ్రహ్మము జగత్తుకంటె గొప్పది- ప్రతిశరీరము లోపలనును ప్రవేశించియున్నది- జగత్తు వెలుపల నంతయు చుట్టుకొనియున్నది- ఆ పరమేశ్వరుని తెలిసికొనినవారు ముక్తిని పొందుదురు

శ్వే॥ ౩అ॥ ౧౯మ॥

అపాణిపాదో జవనో గ్రహీతా
పశ్యత్యచక్షుస్స శృణోత్యకర్ణః।
స వేత్తి వేద్యంనచతస్యాస్తివేత్తా
తమాహురగ్ర్యంపురుషంమహాన్తమ్॥ ౧౯॥

(సః) అపాణిపాదః (సన్)— (ఆయీశ్వరుఁడు) చేతులును కాళ్లును లేనివాఁడు (అగుచు), జవనః గ్రి

హీం తౌచ (భవతి)— దూరము గాఁబోవువాఁడును అన్నిటినిపట్టుకొనువాఁడును (అగుచున్నాఁడు)— అచక్షుః(సన్) పశ్యతి— కన్నులులేనివాఁడు (అగుచు)చూచుచున్నాఁడు- అకర్ణః(సన్) శృణోతి— చెవులులేనివాఁడు(అగుచు) వినుచున్నాఁడు- సః వేద్యం వేత్తి—ఆతఁడు తెలిసికొనవలసినదానిని తెలిసికొనుచున్నాఁడు- తస్య వేత్తా నాస్తి— ఆతనిని తెలిసికొనెడివాఁడు లేఁడు. తమ్ అగ్ర్యం మహాన్తం పురుషమ్ ఆహుః— ఆతనిని శ్రేష్ఠుఁడైన గొప్ప పురుషునిగాను చెప్పుచున్నారు

తా॥ పరమేశ్వరుఁడు చేతులు కాళ్లు మొదలయినవి లేకపోయినను అన్నిపనులను చేయును- సర్వవ్యాపకుఁడై యుండుటచేత ఎంతదూరముపోయినను ఆతఁడు లేకయుండఁడు- భగవంతుని స్వరూపమును ఎవ్వరును ఎఱుంగలేరు- ఈతఁడే పరమపురుషుఁడు.

ముణ్డ॥ ౨॥౧॥౯॥

అతః సముద్రా గిరయశ్చ సర్వే
అస్మాత్స్యన్దన్తే సిన్ధవః సర్వరూపాః।
అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ
యేనైష భూతైస్తిష్ఠతే హ్యన్తరాత్మా॥

అతః సర్వే సముద్రాః గిరయశ్చ (భవన్తి)—ఈతని వలన అన్ని సముద్రములును పర్వతములును (కలుగుచున్నవి)- సర్వరూపాః సిన్ధవః— అన్నిరంగు

లునుగల నదులు, అస్మాత్ స్యన్దన్తే-ఈతనివలననే ప్రవహించుచున్నవి- సర్వాః ఓషధయః రసశ్చ అతః (భవన్తి)- అన్ని ఓషధులును రసంబును ఈ తనివలననే (కలుగుచున్నవి)- యేన= ఏహేతువు చేతను, అన్తరాత్మా (సన్) భూతైః తిష్ఠతే= అంతరాత్మయగుచు భూతములతోఁగూడ ఉన్నాఁడో-

తా॥ సముద్ర నదీ పర్వతాదులన్నియును పరమేశ్వరుని వలనఁ గలిగినవియె- ఆతఁడు అన్ని భూతములలోను నంతరాత్మయై యున్నాఁడు.

ముణ్డ॥౨॥౧॥౪॥

అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ
దిశశ్శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః।
వాయుఃప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాంపృథివీ హ్యేషసర్వభూతాన్తరాత్మా॥

అస్య అగ్నిః మూర్ధా= ఈతనికి ఆకాశము శిరస్సు- చన్ద్రసూర్యౌ చక్షుషీ= చంద్రసూర్యులు నేత్రములు- దిశః శ్రోత్రే= దిక్కులు చెవులు-వివృతాః వేదాః వాక్=ప్రసిద్ధములైన వేదములు వాకు- వాయుః ప్రాణః=వాయువు ప్రాణము- హృదయం విశ్వమ్=అంతఃకరణము జగత్తంతయును-పద్భ్యాం పృథివీ= పాదములు భూమి. ఏషః సర్వభూతాన్తరాత్మా=ఈతఁడు అన్నిభూతములకు నంతరాత్మయైనవాఁడు.

తా॥ పరమేశ్వరునకు శిరస్సు మొదలగు

నవి లేవు- జగత్తులో మీఁదనుండువానిని మీఁది యవయవములను గాను క్రిందనుండువానికిఁ గ్రిందియవయవములను గాను వర్ణింతురు- ఈతఁడు అన్నిభూతములలోను నున్నవాఁడు.

ముణ్డ ॥౧॥౧॥౯॥

యస్సర్వజ్ఞస్సర్వవిద్యస్యజ్ఞానమయంతపః।
తస్మాదేతద్బ్రహ్మనామరూపమన్నంచజాయతే॥

యః సర్వజ్ఞః- ఎవ్వఁడు అన్నిటిస్వరూపములను నెఱింగినవాఁడో, యః సర్వవిత్ - ఎవ్వఁడు అన్నిటిప్రకారములను నేఱింగినవాఁడో, యస్య తపః జ్ఞానమయమ్- ఎవ్వని వ్యాపారము జ్ఞానస్వరూపమైనదో, తస్మాత్ -ఆతనివలన, ఏతత్ బ్రహ్మ నామరూపమ్ అన్నంచ జాయతే - ఈ అవ్యాకృతము నామరూపములుగలదియును అన్నంబును అగుచున్నది-

తా॥ భగవంతుఁడు అన్నిటిని అన్నివిధములనెఱింగినవాఁడు- ఆతఁడు సృష్ట్యాదులుచేయుటకు పనిచేయఁడు- సంకల్పించుట మాత్రమె- ఆతనివలననె ప్రకృతి జగద్రూపముగాఁబరిణమింపుచున్నది-

శ్వేతాశ్వ ॥౬అ॥౭మ॥

తమీశ్వరాణాంపరమంమహేశ్వరం
తందేవతానాంపరమంచదైవతమ్।
పతింపతీనాంపరమంపరస్తా

విదామ దేవం భువనేశమీడ్యమ్॥

ఈశ్వరాణాం పరమం మహేశ్వరం తం విదామ-ప్రభువులకు గొప్ప మహాప్రభువైన ఆతనిని తెలిసికొనియెదము- దైవతానాం పరమం దైవతం-దేవతలకు గొప్ప దేవతయైనవాఁడును, పతీనాం పతిమ్- అధిపతులకు అధిపతియైనవాఁడును, అక్షరాత్ పరస్తాత్ పరమమ్-జీవునికంటె పైని గొప్పవాఁడైనవాఁడును, భువనేశమ్-లోకములకేలికయును, ఈడ్యమ్-స్తోత్రము చేయఁదగినవాఁడును, దేవమ్-ప్రకాశించువాఁడునగు, తం విదామ-ఆతనిని తెలిసికొనెదము-

తా॥ పరమేశ్వరుఁడు లోకములోని ప్రభువులకందఱకును ప్రభువైనవాఁడు- అనఁగా ఆతనికి ప్రభువుమఱి లేఁడనుట- మిగిలినవారు కొంతకొంతకే ప్రభువులు- ఈతఁడు అన్నిలోకములకును ప్రభువు-కావున ఈతఁడె స్తోత్రము చేయఁదగినవాఁడు-

తైత్తి॥ ఆనన్ద॥ ౯ అను॥

యతో వాచో నివర్తన్తే।
అప్రాప్య మనసా సహ।
ఆనన్దం బ్రహ్మణో విద్వాన్।
న బిభేతి కుతశ్చనేతి॥

వాచః మనసా సహ అప్రాప్య- వాక్కులు మనస్సుతోఁగూడ పొందలేక, యతః నివర్తన్తే- దేనినుండి మఱలుచున్నవో, బ్రహ్మణః తం ఆనన్దం

విద్వాన్=బ్రహ్మముయొక్క ఆ ఆనందమును తెలిసికొనుచున్నవాఁడు, కుతశ్చన నబిభేతి= దేనికిని భయపడఁడు- ఇతి=అని-

తా॥ పరబ్రహ్మముయొక్క యానందముమన మాటలచేఁ జెప్పనలవిగానిది- మనస్సుచేతఁ దలఁపన లవికానిది-

ముణ్డ॥ ౧॥ ౧॥ ౬మ॥

యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణ
మచక్షుశ్శ్రోత్రంతదపాణిపాదమ్।
నిత్యంవిభుంసర్వగతంసుసూక్ష్మంతదవ్యయం
యద్భూతయోనింపరిపశ్యన్తిధీరాః॥

యత్తత్=ఎయ్యది, అద్రేశ్యమ్=చూడశక్యముకానిదో, అగ్రాహ్యమ్=పట్టుపడనిదో, అగోత్రమ్=మూలములేనిదో, అవర్ణమ్=రంగులులేనిదో, అచక్షుశ్శ్రోత్రమ్=కన్నులును చెవులును లేనిదో, తత్ అపాణిపాదమ్=అది కాలుసేతులులేనిది- తత్ నిత్యమ్= అది అన్నికాలములయందునుండునది- విభుమ్=అన్నిచోటులనునుండునది- సర్వగతమ్=అన్నిటిలోనునువ్యాపించియున్నది- కావున నే, సుసూక్ష్మమ్=మిక్కిలిసూక్ష్మమైనది- అవ్యయమ్=నిర్వికారమైనది- ధీరాః యత్ భూతయోనిం పరిపశ్యన్తి=బుద్ధిమంతులు దేనిని అన్నిభూతములకునుగారణమునుగాను తెలిసికొనుచున్నారో.

తా॥ పరబ్రహ్మము మన నేత్రములు మొద

లకునింద్రియములచేఁ దెలియఁబడదు- ఆ పరబ్రహ్మ
మునకు చేతులు కాళ్లు కన్నులు చెవులు మొద
లగునవి లేవు- తెలుపు మొదలగురంగులును లేవు- అ
న్నికాలములయందును అన్నిచోట్లను అన్నిటిలో
నును వ్యాపించియుండును. అన్నిభూతములకును గా
రణము.

ఛాందో॥౮॥౧॥౫॥

ఏష ఆత్మాఽపహతపాప్మా విజరో విమృత్యు
ర్విశోకో విజిఘత్సోఽ పిపాసస్సత్యకామ
స్సత్యసంకల్పః-

ఏషః ఆత్మా= ఈ పరమాత్మ, అపహతపాప్మా=
పాపసంపర్కము లేనివాఁడు- విజరః= ముదిమి లేని
వాఁడు- విమృత్యుః= మరణము లేనివాఁడు- విశో
కః= దుఃఖము లేనివాఁడు- విజిఘత్సః= ఆకలి లేని
వాఁడు- అపిపాసః= దప్పిక లేనివాఁడు- సత్యకా
మః= కోరవలసినవన్నియు కలిగియున్నవాఁడు- స
త్యసంకల్పః= వ్యర్థము కాని సంకల్పములు గలవాఁ
డు-

తా॥ పరమేశ్వరుఁడు పాపము ముదిమి చా
వు దుఃఖము మొదలగు దుర్గుణములు లేనివాఁడు-స
త్యకామత్వము మొదలగు కళ్యాణగుణములు కల
వాఁడు.

ఛాందో॥౬॥౮॥౬॥

సన్మూలాః సోమ్యేమాః సర్వాః

ప్రజాస్సదాయతనాస్స త్ప్రతిష్ఠాః॥

(హే) సోమ్య—(ఓ) సోమయాగమునకుఁదగినవాఁడా! ఇమాః సర్వాః ప్రజాః— ఈఅందఱు ప్రజలును, సన్మూలాః=బ్రహ్మమేమూలముగాఁగలవారు- సదాయతనాః=బ్రహ్మమెయాధారముగాఁగలవారు- స త్ప్రతిష్ఠాః=బ్రహ్మమునందె లయమునుపొందువారు-

తా॥ ఈజగత్తుయొక్క సృష్టి స్థితిసంహారములకు ఆధారమైనది బ్రహ్మము-

శ్వేతాశ్వ॥౬అ॥౧౬మ॥

సవిశ్వకృద్విశ్వవిదాత్మయోని

ర్జ్ఞః కాలకారోగుణీసర్వవిద్యః।

ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశ

స్సంసార మోక్షస్థితిబన్ధహేతుః॥

సః విశ్వకృత్ = అతఁడు అంతటిని జేసినవాఁడు- విశ్వవిత్ — అన్నిటినెఱుఁగువాఁడు- ఆత్మయోనిః—ఆత్మయును కారణంబునైనవాఁడు- జ్ఞః—తెలివిగలవాఁడు- కాలకారః—కాలమునకుఁగర్తయైనవాఁడు- గుణీ— కల్యాణగుణములుకలవాఁడు- సర్వవిద్యః—అన్నిటివిధములనెఱిఁగినవాఁడు- ప్రధానక్షేత్రజ్ఞపతిః=ప్రకృతికిని జీవులకును అధిపతియైనవాఁడు- గుణేశః—సత్త్వరజస్తమోగుణములకు అధిపతియైనవాఁడు- సంసారమోక్షస్థితిబన్ధహేతుః—సంసారమువిడిచిపోవుటకును సంసారమునఁ గాపా

డుటకును సంసారముఁ గలుగుటకును హేతువైనవాఁడు-

తా॥ ఆపరమేశ్వరుఁడు ఆత్మయైనవాఁడు- సర్వజ్ఞుఁడు- అన్నిటిని సృజించువాఁడు- రక్షించువాఁడు- కాలమునుగూడ నడపించువాఁడు- మోక్షము నిచ్చువాఁడు- కోరినవానికి సంసారమునుగూడ నిచ్చువాఁడు-

సుబా॥ ౫ఖం॥

ఏషసర్వజ్ఞ ఏషసర్వేశ్వర ఏషసర్వాధిపతి
రేషోన్తర్యామ్యేషయోనిస్సర్వస్య-

ఏషః సర్వజ్ఞః = ఈతఁడు అన్నిటినెఱుంగువాఁడు- ఏషః సర్వేశ్వరః = ఈతఁడు అన్నిటిని నియమించువాఁడు- ఏషః సర్వాధిపతిః = ఈతఁడు అన్నిటికిని స్వామి- ఏషః అన్తర్యామీ = ఈతఁడు అంతర్యామి- ఏషః సర్వస్య యోనిః = ఈతఁడు అంతటికిని కారణము-

తా॥ పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడు- అన్నిటికిని ఏలిక- అన్నిటికిని స్వామి- అంతర్యామి- అన్నిటికిని కారణము.

సుబా॥ ౬ఖం॥

ఏషసర్వభూతాన్తరాత్మాఽపహత
పాప్మాదివ్యోదేవ ఏకో నారాయణః॥

ఏషః నారాయణః = ఈనారాయణుఁడు, సర్వభూతాన్తరాత్మా = అన్నిభూతములకును అంతరాత్మయైనవాఁడు- అపహతపాప్మా = పాపసం

పర్కము లేనివాఁడు- దివ్యః=ప్రకృతిసంబంధికాని వాఁడు- దేవః= ప్రకాశించువాఁడు- ఏకః=అసహాయుఁడు-

తా॥ పరమేశ్వరుఁడు అన్నిటికి నంతరాత్మ, పాపసంపర్కము లేనివాఁడు, ప్రకృతిసంబంధము లేనివాఁడు, ప్రకాశించువాఁడు, అసహాయుఁడు-

కఠ॥ ౨వ॥ ౧౨మ॥

తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్।
అధ్యాత్మయోగాధిగమేన దేవం
మత్వా ధీరో హర్షశోకౌ జహాతి॥

దుర్దర్శం= చూడశక్యముకానివాఁడును, గూఢం= దాఁగియున్నవాఁడును, అనుప్రవిష్టం=అన్నిటిలో నుంజొచ్చియున్నవాఁడును, గుహాహితం= హృదయములలోనున్నవాఁడును, గహ్వరేష్ఠం=ఆత్మలలోనున్నవాఁడును- పురాణం=పురాతనుఁడైనవాఁడునగు, తం దేవం అధ్యాత్మయోగాధిగమేన మత్వా=ఆ దేవుని ఆత్మనుగూర్చిన యోగమును పొందుటచేత తలంచి, ధీరః హర్షశోకౌ జహాతి= బుద్ధిమంతుఁడు సంతోషదుఃఖములను విడుచుచున్నాఁడు-

తా॥ పరమేశ్వరుఁడు చూడశక్యముకానివాఁడు- అజ్ఞానము కలవారిచేఁ దెలియఁబడనివాఁడు- అందఱికిని అంతర్యామియైనవాఁడు- ఆదిలేని

వాఁడు- ఇట్టి భగవంతుని జ్ఞానముగలబుద్ధిమంతుఁడు లోకములోని సుఖదుఃఖములను బొందఁడు-

కఠ౹౹ ౨వ౹౹ ౨౨మం౹౹

అశరీరꣳ శరీరే
ష్వనవస్థేష్వవస్థితమ్।
మహాన్తం విభుమాత్మానం
మత్వా ధీరో న శోచతి॥

అశరీరమ్= శరీరము లేనివాఁడును, అనవస్థేషు శరీరేషు అవస్థితమ్—నిత్యములుకాని శరీరములయందు ఉన్నవాఁడును, మహాన్తమ్ విభుమ్—గొప్పవాఁడును సర్వవ్యాపకుఁడునగు, ఆత్మానం మత్వా—పరమాత్మను తలంచి, ధీరః నశోచతి—బుద్ధిమంతుఁడు దుఃఖింపఁడు-

తా౹౹ పరమాత్మ శరీరము లేనివాఁడు- గొప్పవాఁడు- సర్వవ్యాపకుఁడు- అనిత్యములైన శరీరములయందుఁగూడ వ్యాపించియున్నవాఁడు- అట్టి పరమాత్మను తలంచువాఁడు దుఃఖమును బొందఁడు.

కఠ౹౹ ౨వ౹౹ ౨౩మ౹౹

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన।
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూꣳ స్వామ్।

అయమ్ ఆత్మా= ఈ పరమాత్మ, ప్రవచనేన న లభ్యః= మననముచేత పొందఁదగినవాఁడు కాఁడు,

మేధయా నలభ్యః=వట్టి ధ్యానముచేత పొందఁద గినవాఁడు కాఁడు- బహునా శ్రుతేన నలభ్యః-వి స్తారము చదువుచేతను పొందఁదగినవాఁడుకాఁ డు, ఏషః యమ్ వృణుతే-ఈతఁడు ఎవ్వనిని వ రింపుచున్నాఁడో, తేనైవ లభ్యః=వానిచేతనె పొం దఁబడఁదగినవాఁడు, ఏషఃఆత్మా=ఈపరమాత్మ, స్వామ్ తనూమ్-తన స్వరూపమును తస్య వివృ ణుతే-వానికి తెలియఁజేయును-

తా॥పరమేశ్వరుఁడువట్టి చదువు మొదలగు ధానిచేతపొందఁదగినవాఁడుకాఁడు- అతనియనుగ్ర హాము సంపాదించికొనినవానిచేఁబొందఁదగిన వాఁడు-

౪౦॥౨వ॥౨౩మ॥

నావిరతో దుశ్చరితా
న్నాశాన్తో నాసమాహితః।
నాశాన్తమానసో వాపి
ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥

దుశ్చరితాత్ అవిరతః= దుర్వ్యాపారమునుండి మఱలనివాఁడు, ప్రజ్ఞానేన ఏనం నాప్నుయా త్ = జ్ఞానముచేత ఈతని పొందఁజాలఁడు,అశా న్తః నాప్నుయాత్ =శాంతుఁడుకానివాఁడు పొం దఁజాలఁడు, అసమాహితః నాప్నుయాత్ =స్థిర చిత్తుఁడుకానివాఁడు పొందఁజాలఁడు, అశాన్తమా నసోవాపి నాప్నుయాత్ = శాంతినిపొందనిమన

స్సుగలవాఁడైనను గూడ పొందఁజాలఁడు.

తా॥ దుర్వ్యాపారంబును శాంతిలేకపోవుటయు చిత్తస్థైర్యము లేకపోవుటయు గలవాఁడు పరమేశ్వరునిం బొందఁడు.

తైత్తి॥ నారా॥ ౧౦॥ ౧॥

అణోరణీయాన్మహతో మహీయా
నాత్మా గుహాయాం నిహితోஉస్య జన్తోః।
తమక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదాన్మహిమానమీశమ్॥

అణోః అణీయాన్ = సూక్ష్మమైనదానికంటె మిక్కిలి సూక్ష్మమైనవాఁడును, మహతః మహీయాన్ = గొప్పదానికంటె మిక్కిలి గొప్పవాఁడును. ఆత్మా = పరమాత్మ, అస్య జన్తోః గుహాయామ్ నిహితః = ఈ జీవుని యొక్క హృదయమునందు ఉనికిగలవాఁడు. అక్రతుం మహిమానం తమ్ ఈశమ్ = కోరవలసినది లేనివాఁడును మహిమగలవాఁడునగు ఆ ఈశ్వరుని, ధాతుః ప్రసాదాత్ = సృష్టికర్తయొక్క అనుగ్రహమువలన, యదా పశ్యతి = ఎప్పుడు చూచుచున్నాఁడో, తదా వీతశోకః భవతి = అప్పుడు దుఃఖములులేనివాఁడు అగుచున్నాఁడు.

తా॥ పరమేశ్వరుఁడు అన్నిటిలోనుం జొచ్చియున్నవాఁడు. అన్నిటికంటెను గొప్పవాఁడు. అందఱిహృదయములలోనునుండువాఁడు. కోరవలసి

నదిలేనివాఁడు- సృష్టికర్త- మహిమఁగలవాఁడు- ఆతనియనుగ్రహమువలన ఆతనిం దెలిసికొనినవాఁడు దుఃఖములులేనివాఁడగును-

కఠ॥ ౫వ॥ ౧౨మ॥

ఏకోవశీసర్వభూతాన్తరాత్మా
ఏకంబీజంబహుధాయఃకరోతి।
తమాత్మస్థంయేనుపశ్యన్తిధీరా
స్తేషాంసుఖంశాశ్వతంనేతరేషామ్॥

ఏకః వశీ సర్వభూతాన్తరాత్మా యః=ఒంటరియును జగత్తంతయుతనకుస్వాధీనము గానున్నవాఁడును అన్నిభూతములకునులోపలనుండెడియాత్మయైనవాఁడునగు ఎవ్వఁడు, ఏకం బీజం బహుధా కరోతి=ఒకటి విత్తనమును పలువిధములుగా చేయుచున్నాఁడో, ఆత్మస్థమ్ తమ్=ఆత్మలయందుండెడి ఆతనిని, యే ధీరాః అనుపశ్యన్తి=ఏబుద్ధిమంతులు చూచుచున్నారో, తేషామ్ శాశ్వతమ్ సుఖమ్ భవతి=వారికి శాశ్వతమైన సుఖము కలుగుచున్నది- ఇతరేషామ్ నభవతి=ఇతరులకు కలుగదు-

తా॥ పరమేశ్వరుఁడు ఒంటరియైనవాఁడు- అనఁగాసమానుఁడును అధికుఁడును లేనివాఁడు- జగత్తంతయు స్వాధీనముగాఁగలవాఁడు- సమస్తభూతములకును లోపలనుండువాఁడు- జగత్తునకంతకు విత్తనమైన ప్రకృతిని జగద్రూపము

గా పరిణమింపఁజేయువాఁడు- ఆత్మలలోనుండు వాఁడు- ఆతనిం దెలిసికొను వారలకు మోక్షము కలుగును- మిగిలినవారలకు కలుగదు-

కఠ॥ ౫వ॥ ౧౫మ॥

నతత్ర సూర్యో భాతి న చన్ద్ర తారకం
నేమా విద్యుతో భాన్తి కుతోయమగ్నిః।
తమేవ భాన్తమనుభాతి సర్వం
తస్య భాసా సర్వమిదం విభాతి॥

తత్ర సూర్యః న భాతి = ఆపరమేశ్వరుని యెడను సూర్యుఁడు ప్రకాశింపఁడు- చన్ద్ర తారకమ్ న భాతి = చంద్రుఁడు నునక్షత్రములును చేరిన సమూహంబును ప్రకాశింపదు- ఇమాః విద్యుతః న భాన్తి = ఈ మెఱుపులు ప్రకాశింపవు- అయమ్ అగ్నిః కుతః భాతి = ఈ అగ్ని ఏ హేతువువలన ప్రకాశించును?- సర్వమ్ భాన్తమ్ తమేవ అనుభాతి = సమస్తంబును ప్రకాశింపుచున్న ఆతనినె అనుసరించి ప్రకాశింపుచున్నది- ఇదమ్ సర్వమ్ తస్య భాసా విభాతి = ఇది అంతయును ఆతని ప్రకాశముచేతనే ప్రకాశింపుచున్నది-

తా॥ పరమేశ్వరుని తేజస్సు అన్ని తేజస్సులనును అణఁచునది- అన్ని తేజస్సులకును కారణమైనది- అన్ని తేజస్సులును ప్రకాశించుటకు సాధనమగునది-

కఠ॥ ౬వ॥ ౯మ॥

నసందృశే తిష్ఠతి రూపమస్య

నచక్షుషాపశ్యతికశ్చనైనమ్।
హృదామనీషామనసాభిక్లిప్తో
యఏతద్విదురమృతాస్తేభవన్తి॥

అస్య రూపమ్ సన్దృశే నతిష్ఠతి = ఈతని స్వరూపము చూచుటకు నిలువదు- కశ్చన ఏనమ్ చక్షుషా నపశ్యతి = ఒకడును ఈతనిని కన్నుచేతను చూడడు- అయమ్ హృదా మనీషా మనసా అభిక్లిప్తః = ఈతడు భక్తిచేతను ధైర్యము చేతను మనస్సుచేతను తెలియఁదగినవాఁడు- యే ఏతత్ విదుః = ఎవ్వరు దీనిని తెలిసికొనుచున్నారో, తే అమృతాః భవన్తి = వారు ముక్తులు అగుచున్నారు-

తా॥ ఈపరమేశ్వరుని స్వరూపము కంటి యెదుటనిలువదు- అనఁగా కంటికికనఁబడదనుట- భక్తిమొదలగువానితోఁగూడిన మనస్సుచేతనే తెలియఁబడఁదగినవాఁడు- పరమేశ్వరునిందెలిసికొను వారు మోక్షముంబొందుదురు-

బృహ॥ ౫॥౮॥౯॥

ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి
సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః॥

(హే) గార్గి != (ఓ) గార్గీ!, ఏతస్య అక్షరస్య ప్రశాసనే = ఈ అక్షరము (పరబ్రహ్మము) యొక్క ఆజ్ఞలో, సూర్యాచన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః = సూర్యచంద్రులు విశేషముగా ధరింపఁబడిన

హారై ఉన్నారు-

తా॥సూర్యచంద్రులు పరమేశ్వరునియాజ్ఞనె నిలువఁబడియున్నారు-

తైత్తి॥ఆన॥౮అను॥

భీషాస్మా ద్వాతః పవతే
భీషోదేతి సూర్యః।
భీషాస్మా దగ్ని శ్చేంద్రశ్చ
మృత్యు ర్ధావతి పఞ్చమః॥

అస్మాత్ భీషా వాతః పవతే=ఈతనివలని భయమున గాలి విసరుచున్నది- అస్మాత్ భీషా సూర్యః ఉదేతి= ఈతనివలని భయమున సూర్యుఁడు ఉదయింపుచున్నాఁడు- అస్మాత్ భీషా అగ్నిశ్చ ధావతి= ఈతనివలని భయమున అగ్నియును ప్రవర్తింపుచున్నాఁడు- అస్మాత్ భీషా ఇన్ద్రశ్చ ధావతి= ఈతనివలని భయమున ఇంద్రుఁడును ప్రవర్తింపుచున్నాఁడు- అస్మాత్ భీషా పఞ్చమః మృత్యుః ధావతి=ఈతనివలని భయమున అయిదవదియగు మృత్యువు ప్రవర్తింపుచున్నది-

తా॥గాలి సూర్యుఁడు అగ్ని ఇంద్రుఁడు మృత్యువు అనునయిదుగురును పరమేశ్వరుని యాజ్ఞనె ప్రవర్తింపుచున్నారు-

1890.

విశాఖపట్టణము: ఆర్షముద్రాశాల.

